THE ANDHRA PATRIKA. MADRAS.



# ఆంధ్రపత్రిక

3/8068



Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 169 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. గురువారం 20-9-1951 వెల 1 అణా, పోస్టేజి 0-1-2.

# మూడు కాంగ్రెస్ కమిటీలకు, మద్రాస్ ప్రభుత్వానికీ స్వామీజీ తంతి

## బ్రిటన్‌కు అంత్యసందేశం ఇస్తే నూనె సమస్య పరిష్కారం కాదు'

### ప్రధాని మొసాదిక్ కు హారిమన్ స్పష్టీకరణ: రాజరికం కుట్ర పన్నినందుకు టెహరాన్‌లో అరెస్టులు

వాషింగ్టన్, సెప్టెంబరు 19: పర్షియా ప్రధాని డాక్టర్ మొసాదిక్ పంపిన లేఖను బ్రిటన్‌కు అందచేయడానికి అమెరికా అధ్యక్షుని ప్రతినిధి అవిరెల్ హారిమన్ నిరాకరించారు. "ఆ లేఖను తాను బ్రిటన్‌కు అందచేయడంవల్ల నూనె తగాదా పరిష్కారమయ్యే అవకాశాలు పూర్తిగా అంతరించగల"వని హారిమన్ డాక్టర్ మొసాదిక్‌కు తెలియపరిచారు.

ఈ విషయంగా తెలియపరుస్తూ సెప్టెంబరు 15వ తేదిని హారిమన్ మొసాదిక్‌కు పంపిన లేఖ పూర్తి పాఠాన్ని, డాక్టర్ మొసాదిక్ హారిమన్‌కు పంపిన లేఖను నేడిక్కడ ప్రకటించారు.

**అబడాన్‌లోని బ్రిటిష్ పనివారు**

టెహరాన్, సెప్టెంబరు 19: మరి 92 మంది బ్రిటిషు పనివారు నేడిక్కడి నుండి విమానంలో బ్రిటన్‌కు బయలుదేరారు. ఇక అబడాన్ రిఫైనరీలో మిగిలిఉన్న బ్రిటిషు పనివారి సంఖ్య 870.

**పర్షియా రాచరికంపై కుట్ర**

టెహరాన్, సెప్టెంబరు 18: పర్షియాలో రాజరికం కూలద్రోయడానికి కుట్రచేసిన నేరంపై మాజీ ఉపప్రధాని అలీ హెజార్దని, సీక్రెట్ పోలీస్ శాఖ మాజీ అధిపతిని పర్షియా పోలీసులు అరెస్టు చేసినట్లు ప్రభుత్వ ప్రతినిధి ఒకరు నేటిరాత్రి ప్రకటించారు. కుట్ర చేసినవారిపేర్లున్న ఒక రహస్యపట్టిక దొరికినదనీ, తక్కిన్న వారిని కూడా పట్టుకొనడానికై పోలీసులు అన్వేషణ సాగిస్తున్నారనీ ఆయనఅన్నారు. వారిలో చాలమంది పార్లమెంటు సభ్యులుకూడా ఉన్నారట.

క్రిందటి మార్చి నెలలో హత్యచేయబడిన మాజీ ప్రధాని జనరల్ అలీ రాజ్మారా అనుయాయులు ఈ కుట్ర పన్నినట్లు ఆరోపిస్తూ, దీనిపై ఒక సైనిక న్యాయస్థానం విచారణ జరుపుతుందని ఆ ప్రతినిధి ప్రకటించారు. హెజార్దీ అలీరాజ్మారా మంత్రివర్గంలో ఉపప్రధానిగా వ్యవహరించారు.

మాజీ పోలీస్ శాఖాధిపతి జనరల్ బాఫైని. అరెస్టు చేసినట్లు విశ్వసనీయమైనవర్గాలనుండి వచ్చిన వార్తలను ఆ ప్రతినిధి ధృవపరచలేదు. కుట్రలో పాల్గొన్న నేరంపై మాజీ కార్మిక శాఖామంత్రి హార్విజ్ ఖోనారి అరెస్టుకు కూడా వారంటు జారీ అయినట్లు ఆ వర్గంవారు చెప్పారు. చాలమంది పార్లమెంటు సభ్యులను పట్టుకొనడానికై పోలీసులు అన్వేషణ సాగిస్తున్నారు.

పర్షియా మంత్రివర్గం జరిపిన సమావేశానంతరం 'రాజరికాన్ని కూలద్రోయడానికి కుట్ర పన్నిన నేరంపై జనరల్ రాజ్మారాతోడి మంత్రులలో కొందరిని అరెస్టుచేసి, విచారణ చేయడానికి ప్రభుత్వం నిశ్చయించిన' దని ఉప ప్రధాన మంత్రి హుస్సేన్ ఫాతెమీ ప్రకటించారు.

రష్యా సరిహద్దులోఉన్న ఉత్తర పర్షియాలోని అజర్బైజాన్ రాష్ట్రగవర్నరు సునోవరీ ఎగ్బాల్ ను ప్రధాని మొసాదిక్ ఉద్యోగంపై ఆయన పదవినుండి తొలగించినట్లు నేడిక్కడ అధికారరీత్యా ప్రకటన జరిగినది. ఈ చర్యకు కారణమేమీ వివరించడం జరుగలేదు.

డాక్టర్ మొసాదిక్ అమెరికా అధ్యక్షుని ప్రతినిధి ఎవరెల్ హారిమన్ ద్వారా బ్రిటన్‌కు పంపడానికి ప్రయత్నించిన అంత్యసందేశాన్ని విసంవర్ష్యంలో సైనా ఈ దారాంతంలోనా బ్రిటన్‌కు పంపడం జరుగుతుందని పర్షియా జాతీయనూనె సంఘాధ్యక్షుడు హుస్సేన్ మక్కీ అబడాన్‌లో ప్రకటించారు. 15 రోజుల తరువాత అబడాన్‌లో ఇంకా మిగిలి ఉన్న 370 మంది బ్రిటిష్ పనివారిని దేశంనుండి పంపివేసి, అక్కడి రిఫైనరీ స్వాధీనపరచుకోవడం జరుగుతుందని మక్కీ స్పష్టంగా ప్రకటించారు.

---

********************

**నోట్లు వెదజల్లిన బందిపోటు దొంగ**

—(౦)—

**తప్పించుకోడానికి కొత్త పద్ధతి**

ఆగ్రా, సెప్టెంబరు 18:- సాహసులగు ముగ్గురు బందిపోటు దొంగలు ఒక భవనం మూడవ అంతస్తులోవున్న లోకు వ్యాపారస్థుని దుకాణంలోనికి ప్రవేశించి, దుకాణం యజమానిని ఇంకా ముగ్గురిని తమ రివాల్వరులతో గాయపరిచి 29 వేలరూపాయలను దోచారు. వారు భవనం బయటికి రాకమునుపే భవన ద్వారంవద్ద జనులు సమావేశమైనారు. ఈ దొంగలు 10 వేల రూపాయల నోట్లను జనసమూహంలో వెదజల్లి తమకై కని పెట్టుకొనివున్న కారులో తప్పించుకొని పోయారు. తరువాత ఈ కారు భవనానికి 1 మైలు దూరంలో కనిపించింది.

********************

## రాష్ట్ర నిర్మాణం విషయమై ప్రధాని నెహ్రూకు నివేదికలు అందజేశారా అని ప్రశ్న

### సత్యాగ్రహవిషయంలో ఇంకా సంకల్పించలేదని ప్రకటన

గుంటూరు, సెప్టెంబరు 19: ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై భారతప్రధానికి తమతమ నివేదికలను పంపించిందీ లేనిదీ తెలుపవలసిందిగా ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రదేశ్ కాంగ్రెసు సంఘాలకు, మద్రాసు ప్రభుత్వానికి స్వామి సీతారాంగారు తంతిపంపారు.

రాష్ట్రనిర్మాణానికి ఎట్టిరమయిన చర్యలూ తీసుకోక పోయినట్లయితే అక్టోబర్ 8 నుంచీ సత్యాగ్రహం ప్రారంభిస్తారని వెలువడిన వార్తలను స్వామీజీ ఖండించారు. ఇంతవరకూ అలాంటి సంకల్పమేమీ లేదని గూడా స్వామీజీ స్పష్టపరచారు.

**ఆంధ్రరాష్ట్రం**

**స్వామీసీతారాం ఆశయ వివరణ**

గుంటూరు, సెప్టెంబరు 18: నేటి ప్రార్థనానంతర సమావేశంలో స్వామి సీతారాంగారు ఆంధ్ర రాష్ట్రాన్ని గూర్చి దిగువవిధంగా చెప్పారు:

"ఈ ఆంధ్ర మహాయజ్ఞంలో నేను బలి గాక, భగవదనుగ్రహంవల్ల బ్రతికి వుంటే, నా జీవిత శేషాన్నంతటినీ సర్వోదయఆశయాలను ఆచరణలోకి తేవటానికే అర్పిస్తాను. సర్వాంగ సుందరమైన ఆంధ్రరాష్ట్ర స్థాపనమే నా కోరిక. ఆంధ్రరాష్ట్ర పరిపాలనలో అతి స్వల్ప వ్యయంతో అతి దారిద్ర్యం అనుభవిస్తున్న పౌరుని స్థితిని అభివృద్ధి పరచటమే ఆశయంగా కృషి చేయటం సాధ్యమని ఋజువు చేయాలని నేను కలలు కంటున్నాను. ఆంధ్ర రాష్ట్రానికి బడ్జెటులో లోటు వుంటుందని ఎవరూ అడ్డుపెట్టరాదు. సర్వోదయ ఆశయాలే ప్రాతిపదికగా ఏర్పడగల ఆంధ్రరాష్ట్రంలో అన్ని జిల్లాలలో అతి బీదజిల్లా, అందులోనూ అతి బీదగ్రామానికి చెందిన అతి పేదవాని పరిస్థితులను పరిశీలించి, అతని ఆదాయాన్ని పెంచేందుకు మార్గాల అన్వేషణ జరుగుతుంది. మొట్టమొదట అట్టి స్థితిలోవున్న వారికి అన్నవస్త్రాలకు గృహవైద్య విద్యావసతులకు తగినంత అవకాశం కల్పించిన మీదటనే మిగిలినవారి పరిస్థితులను అభివృద్ధిచేసే ఆలోచనలు జరుగగలవు. నేనుఅనుకొంటున్న నిర్మాణాత్మక కార్యక్రమంద్వారా, దేశంలో యీనాడు పెచ్చరిల్లి వున్న ముఠా వర్గ రాజకీయాలకు స్థానం లేకుండా పోతుంది.

"గడచిన 18 ఏండ్లుగా ముఠా రాజకీయాలతో ప్రమేయం పెట్టుకోకుండా జాగ్రత వహించుకొన్న అద్భుత శక్తినంతటినీ యిక పై 3½ కోట్ల ఆంధ్రుల అభ్యున్నతికై వినియోగిస్తాను. ప్రజాహృదయాలలో ప్రగాఢంగా మ్రోగుతున్న రాష్ట్ర వాంఛను కార్యోన్ముఖంగా కేంద్రీకరింప చేయాలి. ఆచరణకు పూనుకొనిన పనులు మానవద్దని అంధులెవ్వరూ భీరువులు కారాదు. ఆంధ్ర పౌరుషాన్ని ప్రకటించండి. (స్వ. వి.)

**కళా వెంకటావుగారు**

మదరాసు, సెప్టెంబరు 19: శ్రీకళా వెంకటావుగారు సెప్టెంబరు 22వ తేదీన గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి 24వ తేదీ విజయవాడకువచ్చి అదే రోజున స్వామి సీతారాంగారిని చూస్తారు.

---

## రిడ్జివే ప్రతిపాదనకు కమ్యూనిస్టుల అంగీకారం

### పాన్‌మున్‌వద్ద అధికారుల సమావేశం

మున్సాన్, సెప్టెంబరు 19: సమితి లెయిజాన్ అధికారులు ఈరోజున కేసాంగుకు సమీపంగా ఉన్న పాన్‌ముణ్ వద్ద కమ్యూనిస్టు ప్రతినిధులతో రెండు గంటలసేపు సంభాషణలు జరిపారు. సలుగురు సమితి సైనికులు కేసాంగు తటస్థ ప్రాంతంలో అక్రమంగా ప్రవేశించారంటూ కమ్యూనిస్టులు చేసిన ఆరోపణల పరిశోధనకై నేటి సమావేశం జరిగినదని అధికారరీత్యా ప్రకటన జరిగినది. ఆగస్టు 23వ తేదిని తాము విరమించుకున్న కొరియా యుద్ధ విరమణ సంభాషణలను పునఃప్రారంభించే అవకాశాలు పరిశీలించే నిమిత్తం ఈ సమావేశం ఏర్పాటు చేయమని కమ్యూనిస్టు సైన్యాధిపతులు నిన్న కోరారు.

ఉభయపక్షాల లెయిజాన్ అధికారులు పాన్‌ముణ్ వద్ద సమావేశం జరపాలని సమితి సర్వసైన్యాధిపతి జనరల్ రిడ్జివే చేసిన కొత్త ప్రతిపాదనను కమ్యూనిస్టు సైన్యాధిపతులు నిన్న అంగీకరించారు. ఉభయ పక్షాలవారు అంగీకరించినట్లుగా సరిగా నేటి ఉదయం 9 గంటలకు పాన్‌మున్‌వద్ద సమావేశం జరిగినది. కమ్యూనిస్టు సైన్యాధిపతులకు తాను పంపిన లేఖను జనరల్ రిడ్జివే టోకియోలో నిన్న పత్రికలకు విడుదల చేశారు.

## అమెరికాలో హైడ్రోజన్ బాంబు తయారు

### కర్మాగార నిర్మాణానికి 118 కోట్లడాలర్ల వ్యయం

వాషింగ్టన్, సెప్టెంబరు 18: అమెరికాలో దక్షిణ కెరోలినా రాష్ట్రంలోని సావన్నా నది తీరంపై ఒక పరమాణుశక్తి కర్మాగారం నిర్మించడానికి అదనంగా మరి 48,42,40,000 డాలర్లు గ్రాంటు చేయమని అధ్యక్షుడు ట్రూమన్ ఈరోజున కాంగ్రెసును అర్థించారు.

ఆ కర్మాగారంలో హైడ్రోజన్ బాంబు నిర్మించబడుతుందని ఇక్కడి వార్తలవల్ల తెలుస్తున్నది. మొత్తం 118 కోట్ల డాలర్ల ఖర్చుతో ఆ కర్మాగారం నిర్మించడం జరుగుతుంది. కొరియా యుద్ధం పరిణామంగా ధరలు పెరిగిన కారణంచేతకర్మాగార నిర్మాణ వ్యయం కూడా పెరిగినదని ట్రూమన్ కాంగ్రెసుకు తెలియపరిచారు. ఈ మొత్తం కేవలం కర్మాగారం నిర్మించడానికి మాత్రమే ఖర్చు అవుతుంది.

హైడ్రోజన్ బాంబు నిర్మించడానికి అయ్యేవ్యయం అంచనా వేయడానికి కూడా వీలులేదని పరిశీలకులు చెబుతున్నారు. హైడ్రోజన్ బాంబు నిర్మాణానికి ప్రధానంగా కావలసినది ట్రైటియమ్. ఒకపౌండు ట్రైటియమ్ ఖరీదు 50 కోట్ల డాలర్లు. దానినిబట్టి హైడ్రోజన్ బాంబు తయారు చేయడానికి అయ్యే ఖర్చు ఊహించుకోవచ్చు.

హైడ్రోజన్ బాంబు నిర్మించే విధానం తెలుసుకొనడానికి 200 కోట్ల డాలర్లు ఖర్చు అయినట్లు అంచనా వేయడమైనది. అటంబాంబు హైడ్రోజన్ బాంబుల అభివృద్ధికై 700 కోట్ల డాలర్లకుపైగా కేటాయించడం జరిగినది.

**శ్రీ వినోబా భావే**

జబ్బల్‌పూరు, సెప్టెంబరు 18: సర్వోదయ ప్రణాళిక ఆదర్శాలు, సిద్ధాంతాలు ప్రచారంచేసే లక్ష్యంతో కాలినడకను పర్యటిస్తున్న శ్రీ వినోబా భావే ఈ రోజున మహాకోసలలోని చింద్వారా చేరుకున్నారు. ఆయన ఒక వారంక్రిందట హైదరాబాదు నుండి బయలుదేరారు. అక్టోబరు మొదటివారం ఢిల్లీ చేరుకోగలరు.

## 'మద్రాసు ఆంధ్రులకు తమిళులకు ఉమ్మడినగరంగా ఉండవలసిందే'

### రంగాగారి ప్రకటనను ఖండిస్తూ స్వామి సీతారాం ప్రకటన

గుంటూరు, సెప్టెంబరు 19: "మదరాసు నగరంపై, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి తమిళనాడు కాంగ్రెసు సంఘానికీ ఉమ్మడి హక్కున్నది. అందువల్ల ఆంధ్రులుగాని, తమిళులుగాని, మద్రాసుపై పూర్తిగా హక్కు తమదేనని, నగరాన్ని తమ భాషారాష్ట్రంలో నే చేర్చాలనిఅనే హక్కు లేదు."అలా ఏభాషారాష్ట్రం అయినా అనుకొన్నట్లయితే మద్రాసునగర భవితవ్యం మధ్యవర్తిత్వం ద్వారా పరిష్కారం కావలసివుంటుంది." అని స్వామి సీతారాంగారు ప్రకటించారు.

యన్. జి. రంగాగారు నిన్న పత్రికా విలేఖరుల సమావేశంలో, మద్రాసు నగరంపై ఆంధ్రులు హక్కు వదులుకోవడానికి స్వామి సీతారాంగారు యిష్టపడ్డారు అని చేసిన ప్రసంగంపై, స్వామీజీ యివాళ యీ ప్రకటన చేశారు:

"మద్రాసు నగరం విషయమయి సమష్టి ఒప్పందం కావాలని ప్రధాని నెహ్రూ పట్టుబట్టుతున్న విషయం కూడా మనం గమనించాలి. 1949 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం సమావేశమై

(2-వ పేజీ చూడవలెను)

---

## భారత విభజన అంతర్గాథ

### 'మౌంట్ బాటెన్ దౌత్యోదంతం'

అఖండ భారతావని ఇండియా, పాకిస్థానులుగా చీలిపోయి ఇప్పటి కప్పుడే నాలుగేళ్లు దాటిపోయినవి. ఆఖరు బ్రిటిష్ వైస్రాయిగావచ్చిన లార్డ్ మౌంట్‌బాటెన్ దేశ విభజన కార్యక్రమాన్ని అనుకున్నప్రకారం తు.చ. తప్పకుండా గడువునాటికి పూర్తి చేయడంలో ప్రదర్శించిన చాకచక్యమూ, దక్షతాలోచిది.



ఈ మహత్కార్య సాధనలో మౌంట్‌బాటెన్‌కు ఆలాన్ కాంప్‌బెల్-జాన్సన్ అనే అతడు వైస్రాయి ప్రచారశాఖోద్యోగిగా పనిచేస్తూ అనుదిన కార్య కలాపనిర్వహణలో అత్యంతసన్నిహితంగా ప్రముఖపాత్ర నిర్వహించారు. విభజన తతంగంలో ఏరోజు కారోజు జరిగిన సమస్త విషయాలనూ, లోగుట్టులనూ దినచర్యగా తన 'డైరీ'లో బయటపెట్టాడు. ఈ దినచర్యనే ఆయన ఇప్పుడు ఒక పెద్ద గ్రంథరూపంలో ప్రకటిస్తున్నారు. ఈ గ్రంథం సెప్టెంబరు నెలనాటికి వెలువడుతుంది. ఈ గ్రంథాన్ని ఆంధ్ర పత్రిక వచ్చే ఆదివారం సంచికనుంచీ ధారావాహికంగా ప్రచురించబోతున్నదని పాఠకులకు తెలియచేస్తున్నాము.

భారత దేశ విభజనగాథకు తరతరాలవరకూ ప్రపంచ చరిత్రలో విశిష్ట స్థానం వుండితీరుతుంది. అట్టి విభజన తతంగంలో మన జాతీయ నాయకులైన గాంధీ, నెహ్రూ, పటేల్ ప్రభృతులు ముస్లిం నాయకులైన జిన్నా, లి కతాలీ ప్రభృతులు ఏ వైఖరిని ప్రదర్శించారు? అందరినీ కూడగట్టుకొని రావడంలో మౌంట్‌బాటెన్ ఆయా సన్నివేశాలలో ఏమేమి చేయవలసి వచ్చింది ఈ వ్యాసావళిలో స్పష్టపడుతుంది.

---

## స్వామిసీతారాం ఆరోగ్యం: వైద్యుల ఆందోళన

### దీక్షప్రారంభించిన 35 వ రోజునాటి పరిస్థితి

గుంటూరు, సెప్టెంబరు 19: స్వామి సీతారాం ఆరోగ్యపరిస్థితిపై వైద్యులు చాలా ఆందోళన పడుతున్నారు. స్వామీజీ ప్రాయోపవేశదీక్ష ప్రారంభించి యివాళటికి 35 వ రోజు. నానాటికీ బలహీనమాతున్నారు. కంఠస్వరం సన్నగిల్లుతోంది. వంట్లో సత్తువ లేక నీరుమూపి సందున కాళ్లు క్రమేపీ బాగా ఉబ్బుతున్నాయి.

వైద్యులు ఎంతచెప్పినా, ఆయన ప్రార్థనానంతరం ఉపన్యాసాలు మానలేదు.

స్వామీజీ చాలా బలహీనంగా ఉన్నారని, కంఠస్వరం సన్నగిల్లిందని వైద్యులు నేడు ప్రకటించారు.

**ప్రకాశం పంతులుగారి ఆరోగ్యస్థితి**

మద్రాసు, సెప్టెంబరు 19: ప్రకాశం పంతులుగారు శస్త్రచికిత్స జర్గిన ఆరోజున బలహీనంగాఉన్నా ఆరోజు కారోజు కోలుకుంటున్నారు. ఇంకా వారికి పూర్తి విశ్రాంతి అవసరమని వైద్యులు చెబుతున్నారు. వారుమటుకు నిన్న కాస్త శక్తిరావడంతోటే పది హేను రోజుల్లో విశాఖజిల్లా సంచారం చెయ్యాలంటున్నారు. ఇవాళ వారు స్వామీజీయొక్క, వారి శిష్యుల యొక్క స్థితినిగూర్చి తమ ఆందోళనను వెల్లడించి పరిస్థితి తెలుసుకొనగోరారు. స్వామీజీ వివాదాస్పద విషయాలను మధ్యవర్తిత్వానికి పంపాలని అంటున్నారనీ, మద్రాసు విషయం వివాదాస్పద విషయాలలో లేదని స్వామివారి ఉద్దేశ్యమని రంగాగారు ప్రకటనచేశారని వారికిని వేదింపబడింది. బులుసు సాంబమూర్తి, తెన్నేటి విశ్వనాథం ప్రభృతులు వారిని దర్శించారు.

**కలెక్టర్ల సభ**

మదరాసు, సెప్టెంబరు 19: జనరల్ ఎన్నికల ఏర్పాట్లుగూర్చి చర్చించుటకు రాష్ట్రంలోని జిల్లా కలెక్టరులు కాన్ఫరెన్సు కమిషనరు, యీ నెల 22, 23వ తేదీలలో అసెంబ్లీ భవనమున సమావేశం అవుతారు.

**చైనాకు భారత సుహృద్భావ రాయబారం**

న్యూఢిల్లీ, సెప్టెంబరు 18: భారత సుహృద్భావ రాయబారవర్గంవారు సెప్టెంబరు 20 తేదీన ఇచ్చట బయలుదేరి చైనా వెళ్లుతారు. అక్టోబరు 1 న పెకింగ్‌లో జరిగే చైనా ప్రజా రిపబ్లిక్ ద్వితీయ వార్షికోత్సవాలలో పాల్గొనడానికి ఈ రాయబారవర్గం వెళ్ళుతున్నదని యిచ్చటి చైనీస్ వర్గాలవారు చెప్పుచున్నారు. చైనాయందలి ప్రముఖ ప్రజాసంస్థలనుండి ఈ ఆహ్వానం వచ్చినది.

---

## చీరాలలో స్కూలు ఫైనల్ పరీక్షా కేంద్రం

### పునరారంభానికి అనుమతి

చీరాల, సెప్టెంబరు 11: వచ్చే ఏడాదినుండి ఈ వూరిలో ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షాకేంద్రాన్ని పునరారంభించేందుకు అనుమతినిస్తూ మదరాసు సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డు కార్యదర్శి వద్దనుండి యీ వారంలో ఉత్తరువు వచ్చింది.

1950 పరీక్షాసమయములో కొందరు విద్యార్థులు కాపీలుకొట్టి, వాచర్లపై దౌర్జన్యంజరిపిన ఫలితంగా యిక్కడ పరీక్షాకేంద్రాన్ని రద్దుచేశారు. నిరుడు పరీక్షలకు వెళ్ళేవారు ఒంగోలుకు పోయి అక్కడ హాజరు కావలసి వచ్చింది. చీరాల కౌన్సిల్ వారి కృషి ఫలితంగా పరీక్షాకేంద్రం పునఃస్థాపితమాతున్నది. (స్వ. వి.)

---

## "అక్టోబర్ 2 కు రాష్ట్రమిస్తామని ప్రకటించండి"

### లేకపోతే పరిస్థితి చెయిజారి పోతుంది

### నెహ్రూ, రాజేన్‌బాబుకు కాశేశ్వరరావుగారి విజ్ఞప్తి

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, సెప్టెంబరు 18: అక్టోబర్ 2 వ తేదినాటికి ఆంధ్రరాష్ట్రం యేర్పాటు చేస్తామని తక్షణం భారత ప్రభుత్వం ప్రకటన చేయకపోతే, పరిస్థితి అదుపుతప్పి పోతుందని, హెచ్చరిస్తు విశాలాంధ్ర మహాసభ అధ్యక్షుడు అయ్యదేవర కాశేశ్వరరావు గారు, భారత రిపబ్లికు అధ్యక్షుడైన డా॥ రాజేంద్రప్రసాద్ గారికి ప్రధానమంత్రి నెహ్రూకు తంతిద్వారా నేడొక విజ్ఞప్తి పంపారు. కాశేశ్వరరావుగారు, యీతంతి విజ్ఞప్తిని డా॥ పట్టాభి సీతారామయ్యగారికి సర్వోదయ సమాజ నాయకులకు ఆచార్య వినోబాభావే గారికికూడా పంపించారు.

సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కొరకు, యావదాంధ్ర ప్రజానీకంలో, అపూర్వమైన ఆందోళన బయలుదేరిందని, స్వామీ సీతారాం, ఆరోగ్యపరిస్థితికూడా ఉపద్రవకరంగా ఉన్నదని వారి శిష్యులలో కొందరు ఆసన్నమరణావస్థలో ఉన్నారని కాశేశ్వరరావు గారు తమ తంతిలో స్పష్టంచేశారు.

భారత రిపబ్లిక్ అధ్యక్షుడు ప్రధాన మంత్రి,తమకు న్యాయమని తోచినవిధముగా ఆంధ్రరాష్ట్రమును యేర్పాటు చేయవచ్చు నని కాశేశ్వరరావు గారు సూచించారు.

## 29-వ తేదీ లోపుగా ఆంధ్రరాష్ట్ర బిల్లు

### విశ్వసనీయమైన వర్గాలలో వదంతి

మద్రాసు, సెప్టెంబరు 9: ఈ నెల 29-వ తేదీ లోపుగానే పార్లమెంటులో ప్రవేశపెట్టే ప్రత్యేక బిల్లుద్వారా ఆంధ్రరాష్ట్రం ఏర్పడ గలదని విశ్వసనీయమయిన కొన్ని వర్గాల్లో వదంతిగా ఉంది.

---

## దక్షిణ రైల్వే
### టెండరు నోటీసు

డిపార్టు మెంటలుగా నడపబడు చున్న రిఫ్రెష్‌మెంటు రూములకు ఆహారపు దినుసులు, స్టోరుల సప్లయి.

దక్షిణ రైల్వే మీద డిపార్టుమెంటలుగా నడపబడు చున్న రిఫ్రెష్‌మెంట్ రూములకు 1951 అక్టోబరు 15 వ తేదినుండి ఆరునెలలు ఆహారపు దినుసులు, స్టోరులు సప్లయిచేయుటకు నిర్ణీత ఫారములో సీలు వేసిన టెండర్లు కోరబడుచున్నవి.

2. మద్రాసు పార్కుటౌనులోని ఈ రైల్వే పేమాస్టర్ అండ్ కాషియరుకు రు 10/-లు చెల్లించి పదరు వారు రశీదును చూపించి దిరువ సంతకం దారు ఆఫీసునుండి 3-10-1951 సా 3 గం ల వరకు టెండరుఫారము సెట్టు పూర్తి వివరములు పొందవచ్చును. టెండరుఫారం ఖరీదు క్రింద పంపుమణి ఆర్డర్లన్నియు మద్రాసు పార్కుటౌన్ లోని యీ రైల్వే పే-మాస్టర్ అండ్ కాషియర్ అడ్రసుకు పంపవలెను. టెండర్లు ఫారంఖరీదు వాపసు చేయబడదు. టెండరుఫారం ఒకరిది మరియొకరికి మార్పుకొనరాదు.

3. టెండర్లు పెట్టదలచుకొన్నవారు ఈ రైల్వే పే-మాస్టర్ అండ్ కాషియరువద్ద రు 2,000/-లు ధరావతు సొమ్ము డిపాజిటు చేయవలెను. ఈ సొమ్ము గెలుపొందని టెండరర్లకు వాపసు చేయబడును. గెలుపొందిన టెండరర్ల విషయములో సదరుసొమ్ము సెక్యూరిటీ డిపాజిట్టుక్రింద జమకట్టుకొన బడును. గెలుపొందిన టెండరరు కంట్రాక్టు తీసుకొనక పోయిన యెడల సదరు ధరావతు సొమ్ము జప్తు చేయబడును.

4. టెండర్లు కవర్లమీద "దక్షిణ రైల్వే రిఫ్రెష్‌మెంటు రూములకు ఆహారపు దినుసులు, స్టోరులు సప్లయిచేయుటకు టెండరు" అని సూపర్ స్క్రైబ్ చేయవలెను. 1951 అక్టోబరు 11 వ తేదీ సా 3 గం. ల లోపల చేరునట్టియు, తప్పుగా పూర్తి చేయబడినట్టియు, ధరావతు సొమ్ముక్రింద రు 2,000/-ల డిపాజిట్టుకు రశీదును జతపరిచి పంపనట్టియు, ఇన్‌కంటాక్సు క్లియరెన్సు సర్టిఫికెట్టును జతపరిచి పంపనట్టియు టెండర్లు నిరాకరింపబడును.

5. తక్కువ టెండరునుగాని మరియే టెండరునుగాని అంగీకరింపవలసిన బాధ్యతగాని ఏ టెండరునుగాని అన్ని టెండర్లనుగాని నిరాకరించుటకు ఎట్టి కారణములను తెలుపవలసిన బాధ్యతగాని రైల్వేవారికి లేదు.

6. ఆహారపు దినుసులు, స్టోరుల వివిధ ఐటముల విషయములో కంట్రాక్టును ఒకరికంటె ఎక్కువ మంది కంట్రాక్టర్లకు యిచ్చుటకును, అవసరమైనచో భాగాలుగా టెండరును అంగీకరించుటకును రైల్వేవారికి హక్కు కలదు.

మద్రాసు, 15-9-1951.

కే. ఎల్. గ్రాఫర్డు,
చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంట్.





## 70 మంది ఫ్రెంచి సైనికుల దుర్మరణం

సైగాన్, సెప్టెంబరు 17: సెప్టెంబరు 10 వ తేదీన ఒక ఫ్రెంచి సోల్జర్లను మోసుకెళుతున్న ఒక మందుగనికి కొట్టుకొని పగిలిపోయింది. ఈ ప్రమాదంలో 70 మంది ఫ్రెంచి సైనికులు నిర్హతులైనట్లూ 7 మంది గాయపడ్డట్లు తెలియ వచ్చింది.



### నోటీసు

పరిశ్రమలకు మద్రాసుప్రభుత్వ సహాయ చట్టము 1922 (1923 సం.పు V-వ ఆక్టు)

ఇందు మూలముగ తెలియపరచునదేమనగా, పొగాకు రీడ్రయింగ్ నిమిత్తము మెషినరి, ఎక్విప్‌మెంటు కొనుటకును బిల్డింగులను నిర్మించుటకును గుంటూరులోని గారీ మాన్షన్సువండలి శ్రీ ఎం. గౌరీశంకర్ గారు రు 2,00,000 ల ఋణమును కోరుచు, పరిశ్రమలకు మద్రాసు ప్రభుత్వ సహాయచట్టము 1922 (1923 సం॥పు 5-వ ఆక్టు) క్రింద, మద్రాసు ప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొని యున్నారు.

సదరు సహాయము మంజూరు చేయుటకు ఎవరికైనా ఆక్షేపణ లున్న యెడల, వాను పోజరై ఆక్షేపింప దలచినట్లు ఒక నోటీసును మద్రాసులోని ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డైరెక్టరుకు పంపవలెను. సదరు నోటీసులో తన పేరు, అడ్రెసు, వృత్తి, తన ఆక్షేపణలకు గల కారణముల చిన్న స్టేటుమెంటు తెలుపవలెను. అట్టి నోటీసు, మద్రాసులోని ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డైరెక్టరుకు ఈ నోటీసు ప్రచురణ తేది మొదలు ముప్పది రోజులలోగా చేరవలెను. ఏదైనా ఆక్షేపణలున్న యెడల, దరిమిలా తెలియజేయబడు తేదీని ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డైరెక్టరు గారిచే, మద్రాసు, తౌజండ్ లైట్సు, మార్షన్ గార్డెన్సులోని వారి ఆఫీసు వద్ద విచారింపబడును.

డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్సు, మద్రాసు.



# మద్రాసు వార్తలు

### 'కణ్ణమ్మ హరిజన వాడకు నూతన నామం

మద్రాసు, సెప్టెంబరు 19: మద్రాసు త్యాగరాయనగరు యువజన సంఘం, కార్మికాభ్యుదయ సంఘాల యాజమాన్యాన యిటీవల కణ్ణమ్మపేట హరిజన కాలనీలో బత్తిన పెరుమాళ్లు నాయుడు (ఎం. ఎల్. ఎ.) గారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. పన్నెలగంటి రాఘవయ్య (ఎం. ఎల్. ఎ.) గారు ప్రసంగించారు. సంఘ నిర్వాహకుడు ఎం. రామకృష్ణ తిలక్ గారు యిద్దరు ఎం. ఎల్. ఎ.లను సభికులకు పరిచయం చేసి, యీ హరిజన కాలనీలో లైట్లు, కొళాయిలు, మరుగుదొడ్లు లేక ప్రజలు పడుతున్న యిబ్బందులను వివరించారు. క్రొత్త కాలనీకి ఎం. ఎల్. ఏలు 'గాంధీపురం' అని నామకరణం చేశారు. శ్రీనివాసరావు గారి వందనాలతో సభ ముగిసింది.

### సెక్రటేరియట్ ఆంధ్ర సంఘం

మద్రాసు, సెప్టెంబరు 17: సెక్రటేరియట్ ఆంధ్ర సంఘ అధ్యక్షులుగా కొత్త రఘురామయ్య గారి స్థానే హోంశాఖ సంయుక్త కార్యదర్శి వి. హనుమంతరావు నాయుడుగారు ఎన్నుకోబడ్డారు.

### 27న మద్రాసు ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గ ఎన్నికలు

మద్రాసు, సెప్టెంబరు 18: మద్రాసుజిల్లా ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గ ఎన్నికలు 27వ తేదీ సాయంత్రం 5 గం॥లకు ట్రిప్లికేన్ హైరోడ్డు సందున్న జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో జరుగుతవని ఎన్నికోద్యోగి మన్నేపల్లి హనుమంతరావుగారు తెలుపుతున్నారు.

### ఆహార కార్యదర్శి ఢిల్లీ ప్రయాణం

మదరాసు, సెప్టెంబరు 18: మదరాసు ప్రభుత్వ ఆహార కార్యదర్శి శ్రీ ఆర్. యం. సుందరం గారు ఇవ్వాళ ఢిల్లీ వెళ్ళారు. వారు అక్కడ ఇండియా ప్రభుత్వం వారితో మదరాసులో బియ్యం కటకట గూర్చిన్నీ పారిశ్రామిక నగరాలలో కిరసనాయిలు ధరల పెంపకం గూర్చిన్నీ సంప్రదించ గలరని తెలియుచున్నది.

ఈ నెల 8 వ తేదీన బియ్యంతో మదరాసు చేరవలసిన "సూర్తిహాన్" అనే ఓడ రాక ఆలస్యమవు చున్నందున బియ్యం ఇబ్బందిని గమనించి ఇండియా ప్రభుత్వం బొంబాయి రేవు చేరవలసిన మరొక ఓడను మదరాసు రేవుకు పంపుచున్నట్లు తెలుస్తోంది.

### శ్రీ బి. పరమేశ్వరన్

మదరాసు, సెప్టెం 18: గ్రామోద్ధరణ మంత్రి శ్రీ బి. పరమేశ్వరన్ 21 తేదీన బయలుదేరి చెంగల్పట్, సేలం జిల్లాలలో పర్యటించి 24 తేదీకి మదరాసు చేరెదరు.

### జీవనవ్యయ సూచిక

మదరాసు, సెప్టెంబరు 18: నగరంలో కార్మికతరగతుల జీవనవ్యయం సెప్టెంబరు 1 తేదితో అంతమైన వారంలో ఒక పాయింటు తగ్గి 340 గ వుంది.

### ఉద్యోగులలో అవినీతి

1951 ఏప్రియల్ నెలలో గత మాసాంతమునకు అమల్లోవున్న కేసులను కూడా కలుపుకొని ప్రభుత్వోద్యోగులలో 289 కేసులు వచ్చాయి. అందులో 23 మంది నేరం ఋజువుకానందున విడుదలచేశారు. నేరం ఋజువైన 12 మందికి తగుశిక్షలు విధించారు.

### ఆహారపదార్థముల కల్తీనేరాలు

మదరాసు, సెప్టెంబరు 18: సెప్టెంబరు 1 వ తేదీతో అంతమైనవారంలో మదరాసు ఆహారపదార్థముల కల్తీనిరోధక చట్టంక్రింద 36 మందిమీద కేసులు తేబడ్డాయి. పై కేసులలో నేరస్థులకు మొత్తంమీద రూ 1235 జరిమానా విధించబడింది.

### మద్రాసు సమీపంలో బియ్యం స్వాధీనం

మదరాసు, సెప్టెంబరు 11: రేషనింగ్ అధికారులు సెప్టెంబరు 15 వ తేదీన మదరాసు సమీపంలో ఎరుకొం చేరియందు 1250 పళ్ల బియ్యం జప్తు చేశారు.

### ఎన్.జి. రంగాగారి పర్యటన కార్యక్రమం

మద్రాసు, సెప్టెంబరు 18: ఎన్. జి. రంగాగారు యీ 21, 22, 23 లలో అనంతపురం జిల్లాలోనూ, 24, 25, 26 లలో చిత్తూరు జిల్లాలోనూ, 27, 28 లలో నెల్లూరు జిల్లాలోను పర్యటిస్తారు.

ఆంధ్రరాష్ట్ర వేరుశెనగ వుత్పత్తిదార్ల మహాసభ అ. భా. నూనెగింజల సంఘ వుపాధ్యక్షుడు ఎన్. జి. రంగాగారి అధ్యక్షతను యీ 24 న చిత్తూరు జిల్లా కలెక్టరిలో జరుగుతుంది. సభను ఏ. తిమ్మారెడ్డిగారు ప్రారంభిస్తారు.

### చీఫ్‌పార్సెల్ ఆఫీసులో దొంగతనం

మద్రాసు, సెప్టెంబరు 18: చీఫ్ పార్సెల్ ఆఫీసులో నిన్న రు 4,117-ల కరెన్సీనోట్లు అపహరించబడ్డాయి. ఒక తాళం బద్దలుకొట్టి, యీ నోట్లు, రు. 21/-లకు సెంబడి రశీదులు, యీ నోట్ల అంకెలు వ్రాసిన ఒక కాగితము తోకసహా : పెట్టెకటి ఎత్తుకుపోయారు. నోట్లతాటితో, ప్రేమాడా బట్టల పెట్టె

# కాకినాడ సభలో ప్రముఖుల ప్రసంగాలు

### 120 మంది విద్యార్థులఉపవాసం

కాకినాడ, సెప్టెంబరు 17: స్వామి సీతారాం ఉపవాసదీక్షయెడ సానుభూతి తెలియజేస్తూ నిన్నటిరోజున 120 మంది పాలీటెక్నిక్ విద్యార్థులు శ్రీ సీతారామస్వామి దేవాలయమున 24 గంటలు ఉపవాసము చేశారు. ఆంధ్రరాష్ట్రమును వెంటనే ఏర్పరచాలి అనే నినాదాలతో ఊరేగింపు జరిపారు. సాయంకాలం పురమందిరంలో రాష్ట్ర నిర్మాణదీక్షా సంఘ అధ్యక్షుడు ఎం. ఎ. వి. కె. రంగాచారిగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. (ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఎట్టి చర్యకైనా కడంగుటకు సిద్ధంగా వున్న వారంతా కలిసిన - గత ఆదివారం టవునుహాలులో శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద జరిగిన మహాసభలో-ఆంధ్రరాష్ట్ర నిర్మాణ దీక్షా సంఘం ఏర్పడింది.) బహిరంగ సభలో వరకెంహ దేవర సత్యనారాయణ, పులవర్తి భీమలింగమూర్తి, వై. వెంకన్నదొర, వి. సీతారామస్వామి, పి. పి. సుబ్బారావుగార్లు యింకా చాలమంది నెహ్రూగారి వైఖరి విమర్శిస్తూ మాట్లాడారు. అంతర్జాతీయసమస్యలను పరిష్కరించడానికి పూనుకుంటున్న నెహ్రూగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమై ఏకాభిప్రాయంవుంటేనే కాని జోక్యము కలిగించుకోమనడంలో అర్థంలేదన్నారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం వారి తీర్మానాన్ని నిమర్శిస్తూ, స్వామీ సీతారాం నిరాహార దీక్షను బలపరుస్తూ, విద్యార్థులను ఆంధ్రరాష్ట్ర పోరాటములో పాల్గొనవలసినదని హెచ్చరిస్తూ సభలో తీర్మానము చేశారు.

### వుయ్యూరులో 123 గురు విద్యార్థుల వుపవాసం

ఈ 11న యిక్కడ 123 విద్యార్థులు వుపవాసం చేశారు. వీరందరి సంతకాలతో సత్వరమే ఆంధ్రరాష్ట్ర విభజన కావసాగించి స్వామీ సీతారాం ప్రభృతుల ప్రాణాలను కాపాడువలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తంతి విజ్ఞప్తులను ప్రసిడెంటు ప్రసాదు, నెహ్రూలకు పంపారు. నాటి వుదయం కె. నరసింహారావుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిపింది.

### రాజమండ్రి విద్యార్థుల తీర్మానం

రాజమండ్రి, సెప్టెంబరు 16: నిన్న సాయంత్రం యీ పట్టణవిద్యార్థులు ... బాటుపడి వున్నాయి. దీని నిబట్టి దొంగ లెవ్వరో మొన్న ఆఫీసు మూయకముందే లోపల ప్రవేశించి, బయట తాళాలు వేసివుండగా ఆరాత్రి యీ నేరం చేసివుంటారని భావింపబడుతోంది.

### జనరల్ ఆస్పత్రిలో కలరావల్ల మరొకని మృతి

మద్రాసు, సెప్టెంబరు 18: జనరల్ ఆస్పత్రిలో మరొకడు కలరావల్ల మరణించాడు. ఈతనిని రాయపురం ఇన్‌ఫెక్షస్ డిసీజెస్ ఆస్పత్రికి మార్చే సమయంలోనే ప్రాణం పోయింది.

### మద్రాసుకు అమెరికన్ గోధుమలు

మద్రాసు, సెప్టెంబరు 17: భారతదేశానికి అమెరికా చేస్తున్న ఆహార సహాయ కార్యక్రమాన్ని అనుసరించి సెప్టెంబరు మొదటి రెండు వారాల్లో మద్రాసు రేవుకు దాదాపు 7,000 టన్నుల గోధుమలు వచ్చినవి. గత మాసం ఈ రేవులో మొత్తం 2.000 టన్నుల గోధుమలు దించారు.

ఈ నెల ద్వితీయార్థంలో 11,000 టన్నుల అమెరికను గోధుమలు మద్రాసు రేవుకు వస్తవని అంచనా వేస్తున్నారు.

సెప్టెంబరు ప్రథమ భాగంలో దక్షిణ భారత రేవులలో మొత్తం 22,000 టన్నుల అమెరికను గోధుమలు దించారు. 15 వేల టన్నులను విశాఖపట్నంలో దించారు.

ఈ మాసం పూర్తిఅయ్యేసరికి ద. భారత రేవులలో 50,849 టన్నుల అమెరికన్ గోధుమలు దించుతారని అనుకొంటున్నారు. వీటిలో విశాఖపట్నంలో 15,894 టన్నులు దించుతారు.

### ఎరువుల వాడకంగూర్చి రైతులకు తర్ఫీదు

మదరాసు, సెప్టెంబరు 17: నూతన అభివృద్ధి కరమైన పద్ధతులలో వ్యవసాయము సాగించే విషయము గూర్చి సామాన్య పెంట ఎరువులు రసాయనిక ఎరువులు ఉపయోగించే పద్ధతులలో రైతులకు తర్ఫీదు నిచ్చుటకును అన్ని జిల్లాలలో ప్రతి తాలూకా యందు అనేక చోట్లలో శిక్షణ తరగతులు నిర్వహింపబడ్డవి. చిత్తూరు జిల్లాలో 61 స్థలాల్లో యీ శిక్షణ తరగతులు రైతులకు ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయులు గ్రామోద్యోగులు రివిన్యూ ఇన్‌స్పెక్టరుల నిమిత్తం జరుపబడ్డవి. ఎరువుల కంపోస్టు ఎరువు తయారుచేసే పద్ధతి రసాయనికఎరువుల ప్రయోజనము వాటిని తేలికగా వాడవచ్చునవే విషయం, మంచిరకం విత్తనాలు ఉపయోగించటంవల్ల ప్రయోజనము అభివృద్ధి కరమైన వ్యవసాయ పద్ధతులు గూర్చి యీ తరగతులలో శిక్షణము యివ్వబడింది. కొన్ని చోట్లలో తెగుళ్లను నివారించటానికి క్రిమి సంహార పద్ధతులు కూడా నేర్పారు.

ఊరేగింపు జరిపి శ్రద్ధానందఘాటులో బహిరంగసభ యేర్పాటుచేశారు. డా॥ కల్నల్ డి. యస్. రాజుగారి సభ కధ్యక్షత వహించారు. ఆంధ్రరాష్ట్రం తక్షణం నిర్మింపబడవలసిన ఆవశ్యకతను వివరిస్తూ, స్వామి సీతారాంగారి పవిత్రోద్యమమునకు కృతజ్ఞత తెల్పుతూ, ఆంధ్రనాయకులలోని అనైక్యతను, రాష్ట్రనిర్మాణంపట్ల అగ్రనాయకుల వైఖరినిఖండిస్తూ, టి. బుల్లెయ్య, డి. యస్. ప్రకాశరావు, కె. నాగభూషణం, ఆర్. రామకృష్ణరావు, జి. వి. సుబ్రహ్మణ్యం, పి. సూర్యప్రకాశరావు, గోవిందు లింగరాజు, పుంజెపల్లి శంకర కోటేశ్వరరావు, శ్రీమతి డి. సత్యవతి కె. జాహ్నవి ప్రభృతులు మాట్లాడారు. స్వ. వి.

### ఆంధ్ర కాంగ్రెసు తీర్మానంపై విమర్శ

విజయనగరం, సెప్టెంబరు 17:- "రాష్ట్ర సంపాదనార్థం సీతారాం సల్పుతున్న నిరాహార దీక్షలో కాంగ్రెసువారెవరూ పాల్గొనరాదంటూ నిన్న ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసువారు చేసిన తీర్మానం ఆంధ్రులకు అవమానకరం. దీనివలన కాంగ్రెసు వారు రానున్న ఎన్నికలలో ప్రజలకు మరి కొంతదూరం అయిపోయారు." అని ఇక్కడ మా విలేఖరితో ప్రసంగిస్తూ, ప్రదేశ్ కాంగ్రెసు తీర్మానాన్ని విమర్శిస్తూ ఒక ప్రముఖవ్యక్తి అన్నారు.

విజయనగరంలో అనేక సంఘాల వారు ప్రత్యేక సమావేశాలు జరిపి స్వామి సీతారాం దీక్షను ప్రశంసిస్తూ వెంటనే ఆంధ్రరాష్ట్రాన్ని సాధించాలని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ తీర్మానాలు చేశారు.

### ఖమ్మంమెట్టులో 30 మంది వుపవాసం

ఆంధ్రరాష్ట్ర సిద్ధికై స్వామీ సీతారాంగారు ఆరంభించిన వుద్యమానికి సానుభూతి సూచకంగా యిక్కడ యీ 16న వేమిరెడ్డి ప్రతాపరెడ్డి, మైలవరపు సత్యనారాయణ, జాగర్లమూడి శేషయ్య, మిర్యాల నారాయణగుప్త, హరిజన విద్యార్థి వసతి గృహవాసులు 28మంది వుపవాసాలు చేశారు. సత్యాగ్రహ మారంభిస్తే అందు పాల్గొనేందుకు మధిరవాసులు సంసిద్ధంగా వున్నట్లు తెలుస్తున్నది.

### ఒంగోలులో సానుభూతి ఉపవాసాలు

ఒంగోలు, సెప్టెంబరు 17: స్వామి సీతారాం ప్రభృతుల ప్రాయోపవేశ దీక్షకుసానుభూతి తెల్పుతూ, యిచట వేదపాఠశాలలో కొంతిమంది వుపవసించి గాయత్రి జపము, రుద్రాభిషేకము, వేదపారాయణము జరిపారు.

సాయంత్రం నగరనామ సంకీర్తన జరిగిన పిమ్మట కొండమీద దేవాలయం వద్ద కోటా విశ్వనాథంగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగినది. పెద్దిబొట్ల రామచంద్రరావు, పెన్నెలగంటి సూర్యనారాయణ, ములుకుట్ల శ్రీరామమూర్తి, డా॥ చిలకలపాటి అనంత కృష్ణమాచార్యులు, కరవది వెంకటేశ్వర్లు, సాగి విజయ రామరాజు, వావిలాల వెంకటేశ్వర్లు, బొల్లాపల్లి సత్యనారాయణ, ధేనువకొండ సుబ్బారావు గారలు స్వామిజీ దీక్షను బలపరుస్తూ మాట్లాడారు. వివాదాంశములనూ మధ్యవర్తిత్వమునకు వదలి సత్వరమే ఆంధ్రరాష్ట్రం ఏర్పడవలెనని కేంద్ర ప్రభుత్వం వారినికోరుచూ తీర్మానించారు.

నెల్లూరులో జర్గిన ఆంధ్ర కాంగ్రెసు సమావేశంలో స్వామీ సీతారాం కార్యక్రమముతో సహకరించ కూడదని చేసిన తీర్మానమునకు అసమ్మతి తెలుపుతూ తీర్మానించారు.

### చీరాలలోసానుభూతిఉపవాసాలు

చీరాల, సెప్టెంబరు 18: కాంగ్రెసు కార్యకర్తలు కోటరాములు, అనుముకొండ చంద్రయ్య, కడలి జగన్నాథరావు శిఖాకొల్లి జగన్నాథం, గుంటి పాపయ్య, చల్లా వీరరాఘవయ్యశాస్త్రి, మంగళాపురపు దక్షిణామూర్తి మద్దు సూర్యనారాయణ, అకురాతి వెంకటస్వామి, నిన్న ఉదయం స్థానిక శివాలయంలో సానుభూతి సూచకంగా 24 గంటల ఉపవాసవ్రతం ప్రారంభించారు.

స్వామీ సీతారాం ప్రభృతులు ప్రాణాలకు ముప్పులేకుండా కాపాడవలసిందనీ, సత్వరం ఆంధ్ర రాష్ట్రాన్ని సమకూర్చాలని పూజలు అభిషేకములు జరుపబడినవి. ఆంధ్ర మహాయజ్ఞ బహ్వృలను గురించి ఒంగోలు న్యాయవాది ఆదిపూడి సుబ్బారావుగారు మాట్లాడారు.

వెంటనే ఆంధ్రరాష్ట్రం యేర్పాటు చేసి, స్వామీ సీతారాం ప్రభృతుల ప్రాణాలను కాపాడాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరుతూ తీర్మానించారు. ప్రాయోపవేశం విరమించ వలసిందిగా స్వామీజీకి విజ్ఞప్తిచేశారు. ఆంధ్రుల కోర్కె నెరవేరకపోతే శాసన సభ్యులంతా రాజీనామా యివ్వాలని, తీర్మానాలుచేసి, వీటిని డా. రాజేంద్ర ప్రసాద్, నెహ్రూ, స్వామి సీతారాం, రాష్ట్ర ముఖ్యమంత్రి కుమారస్వామి రాజా గారలకు తంతి మూలకంగా తెలియపర్చారు. బి. పి. ఆర్. విఠల్ మూడు రోజులుగా ఉపవాసం చేస్తున్నారు.

### తెనాలి పురపాలకసంఘ తీర్మానం

తెనాలి, సెప్టెంబరు 16: నిన్న సాయంకాలం 5 గంటలకు యీ పురపాలకసంఘ సమావేశము చైర్మన్ శ్రీ నన్నపనేని వెంకటరావుగారి అధ్యక్షతను జరిగినది. సత్వర ఆంధ్రరాష్ట్ర సిద్ధికై శ్రీ స్వామీ సీతారాం గారు సాగిస్తున్న నిరాహారదీక్షకు తమ సానుభూతిని ప్రకటిస్తూ వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు పూనుకోవలసినదిగా ప్రభుత్వమును కోరుతూ ఏకగ్రీవముగా తీర్మానించారు. (స్వ. వి.)

### చేనేత పారిశ్రామికుల తీర్మానం

భీమవరం, సెప్టెంబరు 16: ఆంధ్రరాష్ట్ర జాతీయ చేనేత కాంగ్రెసు నాయకుల రాక సందర్భములో భీమవరం స్వామీజీ టాకీస్‌లో సా॥ 3 గంటలకు మోటుపల్లి వెంకటశివుడు గారి అధ్యక్షతను సభ జరుపబడినది.

నేడు చేనేత ప్రజలు పడుతున్న కష్టాలు వాటి నివారణకు మార్గాలను గురించి గుడిమెట్ల గంగరాజుగారు వుపన్యసించారు.

తరువాత రాష్ట్ర ఆర్గనైజరు కె. రాములుగారు ఆంధ్రరాష్ట్ర అవతరణ వల్ల చేనేత పారిశ్రామికుల సమస్యలు పరిష్కరింపబడును. గనుక చేనేత ప్రజలంతా ఆంధ్రరాష్ట్రోద్యమానికి అండగా వుండాలని విజ్ఞప్తి చేశారు.

స్వామీ సీతారాం చేస్తున్న ప్రాయోపవాసం ఆంధ్రులలో నూతన చైతన్యాన్ని కలిగించిందిగాన ఇక తమ ఉపవాసదీక్షను విరమించవలసినదిగా ప్రార్థిస్తూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణం వెంటనే జరిగించవలసినదిగా కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించడమైనది.

### ఆంధ్రరాష్ట్ర సమస్య కన్నా స్వామీజీ ప్రాణం విలువైనది.

కైకలూరు పంచాయతీబోర్డు వారు చేసిన తీర్మానంలో ఆంధ్రరాష్ట్రం కంటె కూడా స్వామీ సీతారాంగారి ప్రాణం విలువైనదని తెలుపుతూ, ఆ కారణంచేత స్వామీజీ నిరాహారోపవేశం విరమించమని కోరారు. ఆంధ్రరాష్ట్ర విభజనను సాధ్యమైనంత త్వరలో జరిపించమని భారత ప్రధానిని కోరారు.

### చిత్తూరుజిల్లా కాంగ్రెసువారి విజ్ఞప్తి

సత్వర ఆంధ్రరాష్ట్ర సిద్ధికై ప్రాయోపవేశ దీక్షపూనిన స్వామీ సీతారాం ప్రభృతులను దీక్ష విరమించమని చిత్తూరుజిల్లా కాంగ్రెసుతరఫున అధ్యక్షుడు కె. వరదాచార్లు (ఎం. ఎల్. ఎ.) గారు యీ 7 న తంతి ద్వారా విజ్ఞప్తిచేశారు.

### తెనాలి మునిసిపల్ హైస్కూలు హెడ్‌మాస్టరు నియామకం

తెనాలి, సెప్టెంబరు 3: తాలూకా హైస్కూలులో అసిస్టెంటు హెడ్‌మాస్టరుగానైన వల్లూరు హనుమంతరావుగారు స్థానిక మునిసిపల్ బాలుర హైస్కూలు హెడ్‌మాస్టరుగా నియమితులైనారు. (స్వ. వి.)

## గవర్నమెంటు ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటు
### మద్రాసు ఎలెక్ట్రిసిటీ సిస్టం
టెలిఫోన్ నంబరు మార్పు.

ప్రజలకు తెలియపరచునదేమనగా, మెయిన్సు డిపార్టుమెంటు (కొల్లు ఫ్యాక్టరీకు, ఎలెక్ట్రిక్ సప్లయి ఆగిపోవుట వర్తమానాలకు) టెలిఫోన్ 22-9-1951 రా. 9 గం. నుండి 85441 నెంబరుకు మార్చబడును.

ఎలెక్ట్రిక్ సప్లయి నిలిచిపోయినప్పుడు 85441 నంబరు డయల్ చేయండి.

ఏ ఆర్ నారాయణరావు,
సూపరింటెండింగ్ యింజనీరు,
మద్రాస్ ఎలెక్ట్రిసిటి సిస్టం

